# అథ ఏకోన వింశో%ధ్యాయః

# దూతసంవాదము

వ్యాస ఉవాచ |

సనత్కుమార సర్వజ్ఞ నారదే హి గతే దివి | దైత్యరాట్ కిమకార్షీత్స తన్మే వద సువిస్తరాత్ || 1

వ్యాసుడిట్లు పలికెను-

ఓ సనత్కుమారా! నీవు సర్వజ్ఞుడవు. నారదుడు ఆకాశమార్గములో నిర్గమించిన పిదప, ఆ రాక్షసరాజు ఏమి చేసెను? వివరముగా చెప్పుము (1).

సనత్కుమార ఉవాచ|

తమామంత్ర్య గతే దైత్యం నారదే దివి దైత్యరాట్ | తద్రూప శ్రవణాదాసీ దనంగ జ్వరపీడితః || 2

అథో జలంధరో దైత్యః కాలాధీనః ప్రసష్టధీః | దూత మాహ్వాయయామాస సైంహికేయం విమోహిత || 3

ఆగతం తం సమాలోక్య కామక్రాంత మనాస్స హి | సుసంబోధ్య సమాచష్ట సింధుపుత్రో జలంధరః || 4

సనత్కుమారుడిట్లు పలికెను-

నారదుడు సెలవు తీసుకొని ఆకాశమార్గములో నిర్గమించిన పిదప ఆ రాక్షసుడు ఆమెయొక్క రూపమును గూర్చి వినియుండుట వలన మన్మథ జ్వరముయొక్క పీడకు గురి ఆయెను (2). బుద్ధి నశించి, మోహమునకు వశుడై మృత్యువునకు ఆధీనుడై జలంధరాసురుడు అపుడు రాహువును దూతగా పంపుటకై పిలిపించెను (3). సముద్ర తనయుడగు జలంధరుడు కామనచే ఆక్రమింపబడిన మనస్సు గలవాడై తన వద్దకు వచ్చిన రాహువును గాంచి చక్కగా సంబోధించి ఇట్లు వివరించెను (4).

జలంధర ఉవాచ |

భో భో దూతవరశ్రేష్ఠ సర్వకార్య ప్రసాధక | సైంహికేయ మహాప్రాజ్ఞ కైలాసం గచ్ఛ పర్వతమ్ || 5

తత్రాస్తి యోగీ శంభ్వాఖ్యస్త పస్వీ చ జటాధరః | భస్మ భూషితసర్వాంగో విరక్తో వి జితేంద్రియః || 6

తత్ర గత్వేతి వక్తవ్యం యోగినం దూత శంకరమ్ | జటాధరం విరక్తం తం నిర్భయేన హృదా త్వయా || 7

హే యోగింస్తే దయాసింధో జాయారత్నేన కిం భ##వేత్ | భూతప్రేత పిశాచాది సేవితేన వనౌకసా || 8

మన్నాథే భువనే యోగిన్నోచితా గతిరీదృశీ | జాయారత్నం మతస్త్వం మే దేహి రత్న భుజే నిజమ్ || 9

యాని యాని సురత్నాని త్రైలోక్యే తాని సంతి మే | మదధీనం జగత్సర్వం విద్ధి త్వం సచరాచరమ్ || 10

ఇంద్రస్య గజరత్నం చోచ్చైశ్శ్రవో రత్న ముత్తమమ్ | బలాద్గృహీతం సహసా పారి జాతస్తరుస్తథా || 11

జలంధరుడిట్లు పలికెను-

ఓయీ రాహూ! నీవు దూతలందరిలో శ్రేష్ఠుడవు. నీవు కార్యముల నన్నిటినీ చక్కబెట్టగలవు. ఓయీ మహాబుద్ధిశాలీ! కైలాస పర్వతమునకు వెళ్లుము (5). అచట తపశ్శాలి, జటలను ధరించువాడు, భస్మతో అలంకరింపబడిన సర్వావయవములు గలవాడు, విరాగి, ఇంద్రియములను జయించినవాడు అగు శంభుయోగి గలడు (6). ఓయీ దూతా! నీవు అచటకు వెళ్లి, జటాధారి, వైరాగ్యసంపన్నుడు అగు శంకరయోగితో నిర్భయమగు హృదయముతో నిట్లు చెప్పుము (7). ఓయీ యోగీ! దయానిధీ! భూత ప్రేతపిశాచాదులతో సేవింపబడే వనవాసివగు నీకు భార్యారత్నముతో పని యేమి? (8) ఓ యోగీ! నేను భువనమునకు ప్రభువునై యుండగా ఇట్టి పరిస్థితి ఉచితము కాదు. కావున నీవు

శ్రేష్ఠవస్తువులకు భోక్తనగు నాకు నీ భార్యారత్నమునిమ్ము (9). ముల్లోకములలోని శ్రేష్ఠ సుందరవస్తువులన్నియు నా వద్ద గలవు. స్థావర జంగమాత్మకమగు ఈ జగత్తు అంతయు నా ఆధీనములో నున్నదని యెరుంగుము (10). ఏనుగులలో గొప్పది యగు ఇంద్రుని ఐరావతమును, ఉత్తమమగు ఉచ్చైశ్శ్రవసమనే గుర్రమును, మరియు పారిజాత వృక్షమును నేను శీఘ్రమే బలాత్కారముగా లాగుకొంటిని (11).

విమానం హంస సంయుక్త మంగణ మమ తిష్ఠతి | రత్నభూతం మహాదివ్యముత్తమం వేధసోఽద్భుతమ్ || 12

మహాపద్మాదికం దివ్యం నిధిరత్నం స్వదస్య చ | ఛత్రం మే వారుణం గేహే కాంచనస్రావి తిష్ఠతి || 13

కింజల్కి నీ మహామాలా సర్వదామ్లాన పంకజా | మత్పితుస్సా మమైవాస్తి పాశశ్చ కపతేస్తథా || 14

మృత్యోరుత్ర్కాంతిదా శక్తిర్మయా నీతా బలాద్వరా | దదౌ మహ్యం శుచిశౌచే చ వాససీ || 15

ఏవం యోగీంద్ర రత్నాని సర్వాణి విలసంతి మే | అతస్త్వమపి మే దేహి స్వస్త్రీరత్నం జటాధర || 16

హంసలు పూన్చినది, విమానములలో శ్రేష్ఠమైనది, మహాదివ్యమైనది, ఉత్తమమైనది, అద్భుతమైనది అగు బ్రహ్మగారి విమానము నా వాకిట నిలబడియున్నది (12). మహాపద్మము మొదలగు కుబేరుని గొప్ప నిధులన్నియు నా ఇంటిలో నున్నవి. వరుణుని ఛత్రము బంగరు కాంతులను వెదజల్లుతూ నా ఇంటియందు గలదు (13). ఎన్నటికీ వాడని పద్మముల కేసరములతో శోభిల్లు గొప్ప మాల నావద్ద గలదు. నా తండ్రి, జలాధిపతి యగు వరుణుని పాశము కూడ నా వద్ధ గలదు (14). ప్రాణులకు మరణము నొసంగు గొప్ప శక్తిని నేను యముని వద్ధనుండి బలాత్కారముగా లాగు కొంటిని. అగ్ని నాకు శుద్ధమైన

రెండు దివ్యవస్త్రముల నిచ్చినాడు (15). ఓ యోగిశ్రేష్ఠా! ఈ తీరున శ్రేష్ఠవస్తువులన్ని యు నావద్ద విలసిల్లుచున్నవి. ఓ జటాధారీ! కావున నీవు కూడ స్త్రీరత్నమగు నీ భార్యను నాకు ఇమ్ము (16).

సనత్కుమార ఉవాచ |

ఇతి శ్రుత్వా వచస్తస్య నందినా స ప్రవేశితః | జగామోగ్ర సభా రాహు ర్విస్మయాద్భుతలోచనః || 17

తత్రత గత్వా శివం సాక్షాద్దేవదేవం మహాప్రభుమ్ | స్వతేజోధ్వస్త తమసం భస్మలేపవిరాజితమ్ || 18

మహారాజోప చారేణ విలసంతం మహాద్భుతమ్ | సర్వాంగ సుందరం దివ్యభూషణైర్భూషితం హరమ్ || 19

ప్రణనామ చ తం గర్వాత్తత్తేజః క్రాంతవిగ్రహః | నికటం గతవాన్ శంభో స్స దూతో రాహుసంజ్ఞకః || 20

అథో తదగ్ర ఆసీనో వక్తుకామో హి సైంహికః | త్ర్యంబకం స తదా సంజ్ఞాప్రేరితో వాక్య మబ్రవీత్|| 21

సనత్కుమారుడిట్లు పలికెను-

రాహువు ఈ జలంధరుని మాటలను విని అచటకు వెళ్లెను. నంది ఆయనను శివుని సభలో ప్రవేశ##పెట్టెను. ఆతడు ఆశ్చర్యముతో విప్పారిన నేత్రములతో ఆ అద్భుతమగు సభను గాంచెను (17). అచటకు వెళ్లి దేవదేవుడు, మహాప్రభుడు, తన తేజస్సుచే చీకట్లను నశింపజేయు చున్నవాడు, విభూతి లేపనముచే ప్రకాశించువాడు (18). మహారాజునకు ఈయబడే పరిచర్యలతో మహాద్భుతముగా ప్రకాశించుచున్నవాడు, సర్వావయవములయందు సుందరుడు, దివ్యములగు భూషణములచే అలంకరింపబడినవాడు, పాపహారియగు శివుని ప్రత్యక్షముగా గాంచి (19). ఆయనకు నమస్కరించెను. ఆయన తేజస్సుచే వ్యాప్తమైన దేహము గలవాడు, రాహువు అను పేరు గలవాడు అగు ఆ దూత గర్వముతో శివుని సమీపమునకు వెళ్లెను (20). ఆయనతో మాటలాడగోరి

సింహికాపుత్రుడగు రాహువు ఆయన ఎదుట గూర్చుండెను. అప్పుడాతడు సంజ్ఞచే ప్రేరితుడై ముక్కంటి దైవముతో నిట్లనెను (21).

రాహురువాచ |

దైత్య పన్నగ సేవ్యస్య త్రైలోక్యాధిపతే స్సదా | దూతో%హం ప్రేషితస్తేన త్వత్సకాశమిహాగతః || 22

జలంధరో%బ్ధి తనయ స్సర్వదైత్యజనేశ్వరః| త్రైలోక్యస్యేశ్వరస్సో%ధాభవత్సర్వాధినాయకః || 23

స దైత్యరాజో బలవాన్ దేవానామంతకోపమః | యోగినం త్వాం సముద్ధిశ్య స యదాహ శృణుష్వ తత్ || 24

మహాదివ్య ప్రభావస్య తస్య దైత్యపతేః ప్రభోః | సర్వరత్నేశ్వరస్య త్వమాజ్ఞాం శృణు వృషధ్వజ || 25

శ్మశాన వాసినో నిత్యమస్థి మాలాధరస్య చ | దిగంబరస్య తే భార్యా కథం హైమవతీ శుభా || 26

అహం రత్నాధి నాథో%స్మి సా చ స్త్రీ రత్న సంజ్ఞితా | తస్మాన్మమైవ సా యోగ్యా నైన భిక్షాశినస్తవ || 27

మమ వశ్యాస్త్ర యో లోకా భుంజే%హం మఖభాగకాన్ | యాని సంతి త్రిలోకే%స్మిన్ రత్నాని మమ సద్మని || 28

వయం రత్నభుజస్త్వం తు యోగీ ఖలు దిగంబరః | స్వస్త్రీరత్నం దేహి మహ్యం రాజ్ఞ స్సుఖకరాః ప్రజాః || 29

రాహువు ఇట్లు పలికెను-

దైత్యులచే నాగులచే సేవింపబడు వాడు, సర్వదా ముల్లోకములకు అధిపతి యగు ఆ జలంధరునిచే పంపబడినవాడనై దూతనగు నేను నీ వద్దకు వచ్చి యుంటిని (22). సముద్రుని కుమారుడు, దితిపుత్రులందరికీ ప్రభువు అగు జలంధరుడు తరువాతి

కాలములో సర్వులకు అధినాయకుడై ముల్లోకములకు ప్రభువైనాడు (23). బలవంతుడు, దేవతలకు మృత్యువుతో సమమైనవాడు అగు ఆ రాక్షసరాజు యోగివి అగు నిన్ను ఉద్దేశించి పలికిన పలుకులను వినుము (24). ఓ వృషభధ్వజా! గొప్ప దివ్యమైన ప్రభావము గలవాడు, రాక్షసాధిపతి, సర్వశ్రేష్ఠవస్తువులకు యజమాని అగు ఆ రాక్షసప్రభుని ఆజ్ఞను నీవు వినుము (25). శ్మశానమునందు నివసించువాడవు, నిత్యము ఎముకల మాలను ధరించు వాడవు, మరియు దిగంబరుడవు అగు నీకు శుభకరురాలు అగు హిమవత్పుత్రి భార్య ఎట్లు అయినది? (26) నేను రత్నములకు అధీశ్వరుడను. ఆమె స్త్రీలలో శ్రేష్ఠురాలు. కావున ఆమె నాకు మాత్రమే యోగ్యురాలగును. భిక్షకుడవగు నీకు ఆమె తగదు (27). నాకు ముల్లోకములు వశములో నున్నవి. నేను యజ్ఞభాగములను భుజించి చున్నాను. ఈ ముల్లోకములలోని శ్రేష్ఠవస్తువు లన్నియు నా ఇంటిలో నున్నవి (28). మేము శ్రేష్ఠవస్తువులను అనుభవించే రారాజులము. నీ వైతే యోగివి, దిగంబరుడవు. నీవద్దనున్న స్త్రీరత్నమును నాకు సమర్పించుము. ప్రజలు రాజునకు సుఖమును కలిగించవలెను గదా! (29)

సనత్కుమార ఉవాచ |

వదత్యేవం తథా రాహౌ భ్రుమధ్యా చ్ఛూల పాణినః |
అభవత్పురుషో రౌద్ర స్తీవ్రాశని సమస్వనః || 30

సింహాస్య ప్రచల జిహ్వాస్స జ్వాల నయనో మహాన్ | ఊర్ధ్వకేశ శ్శుష్కతనుర్నృసింహ ఇవ చాపరః || 31

మహాతనుర్మహా బాహు స్తాల జంఘో భయంకరః | అభిదుద్రావ వేగేన రాహుం స పురుషో ద్రుతమ్ || 32

స తం ఖాదితు మాయాంతం దృష్ట్వా రాహుర్భయాతురః |
అథావదాత వేగేన బహిస్స చ దధార తమ్ || 33

సనత్కుమారుడిట్లు పలికెను-

రాహువు ఇట్లు పలుకు చుండగా, శూలపాణియగు శివుని కనుబొమల మధ్యనుండి భయంకరుడు, తీవ్రమగు పిడుగుతో సమమగు ధ్వని గలవాడు అగు పురుషుడు ఉదయించెను (30). సింహపు నోటిలో వలె కదలాడు చున్న నాలుక గలవాడు, నిప్పులు గ్రక్కు కన్నులవాడు, పెద్ద శరీరము గలవాడు, పైకి లేచి నిలబడిన శిరోజములు గలవాడు, శుష్కించిన దేహము గలవాడు అగు ఆ పురుషుడు అపరనృసింహుని వలె నుండెను (31). పెద్ద దేహము, పొడుగాటి బాహువులు, తాటిచెట్ల వంటి పిక్కలు కలిగి భయమును గొల్పుచున్న ఆ పురుషుడు వెంటనే వేగముగా రాహువుపైకి పరుగెత్తెను (32). తనను తినివేయుటకు వచ్చుచున్న ఆ పురుషుని గాంచి రాహువు భయపీడితుడై వేగముగా పారిపోవుచుండగా ఆ పురుషుడు ఆతనిని బయట పట్టుకొనెను (33).

రాహురువాచ |

దేవదేవ మహేశాన పాహి మాం శరణాగతమ్ | సురాసురై స్సదా వంద్యః పరమైశ్వర్యవాన్ ప్రభుః || 34

బ్రాహ్మణం మాం మహాదేవ భాదితుం సముపాగతః | పురుషో%యం తవేశాన సేవకో%తి భయంకరః || 35

ఏతస్మాద్రక్ష దేవేశ శరణాగతవత్సలః | న ఖాదేత యథాయం మాం నమస్తే%స్తు ముహుర్ముహుః || 36

రాహువు ఇట్లు పలికెను-

ఓ దేవ దేవా! శరణు జొచ్చిన నన్ను రక్షించుము. నీవు దేవతలచే, రాక్షసులచే సర్వదా నమస్కరింపబడు ప్రభుడవు. నీ ఐశ్వర్యము పరమోత్కృష్టమైనది (34). ఓ మహాదేవా! ఈశానా! నీ సేవకుడు, అతి భయంకరుడు నగు ఈ పురుషుడు బ్రాహ్మణుడునగు నన్ను భక్షించుటకై మీదకు వచ్చుచున్నాడు (35). ఓ దేవదేవా! శరణాగత రక్షకుడవగు నీవు ఈతడు నన్ను తినివేయకముందే వీని నుండి నన్ను రక్షింపుము. నీకు అనేక పర్యాయములు ప్రణమిల్లు చున్నాను (36)

సనత్కుమార ఉవాచ |

మహాదేవో వచశ్శ్రుత్వా బ్రాహ్మణస్య తదా మునే | అబ్రవీత్స్వగణం తం వై దీనానాథప్రియః ప్రభుః || 37

సనత్కుమారుడిట్లు పలికెను-

ఓ మునీ! దీనులను అనాథులను ప్రేమించు మహాదేవప్రభుడు అపుడా బ్రాహ్మణుని మాటను విని తన కింకరుడగు ఆ పురుషునితో నిట్లనెను (37).

మహాదేవ ఉవాచ |

ప్రభుం చ బ్రాహ్మణం దూతం రాహ్వాఖ్యం శరణాగతమ్ | శరణ్యా రక్షణీయా హి న దండ్యా గణసత్తమ || 38

మహాదేవుడిట్లు పలికెను-

ఓ గణశ్రేష్ఠా! బ్రాహ్మణుడు, దూత, శరణు జొచ్చినవాడు అగు ఈ రాహువును శిక్షించవలదు. శరణుజొచ్చిన వారిని రక్షించవలెను సుమా!(38)

సనత్కుమార ఉవాచ |

ఇత్యుక్తో గిరిజేశేన స గణః కరుణాత్మనా | రాహు తత్యాజ సహసా బ్రాహ్మణ   తి శ్రుతాక్షరః || 39

రాహుం త్యక్త్వా %ంబరే సో%థ పురుషో దీనయా గిరా | శివోపకంట మాగత్య మహాదేవం వ్యజిజ్ఞపత్ || 40

సనత్కుమారుడిట్లు పలికెను-

కరుణాంతరంగుడగు పార్వతీపతి ఇట్లు పలుకగా ఆ కింకరుడు బ్రాహ్మణుడను మాటను విన్న వెంటనే రాహువును విడిచిపెట్టెను (39). ఆపుడా పురుషుడు రాహువును ఆకాశములో విడిచి పెట్టి శివుని సమీపమునకు వచ్చి ఆ మహాదేవునితో దీనమగు వచనములతో నిట్లనెను (40).

పురుష ఉవాచ |

దేవదేవ మహాదేవ కరుణాకర శంకర | త్యాజితం మమ భక్ష్యంతే శరణాగతవత్సలః || 41

క్షుధా మాం బాధతే స్వామిన్ క్షుత్క్షామశ్చాస్మి సర్వథా | కిం భక్ష్యం మమ దేవేశ తదాజ్ఞాపయ మాం ప్రభో || 42

పురుషుడిట్లు పలికెను-

ఓ దేవదేవా! మహాదేవా ! కరుణానిధీ! శంకరా! శరణాగతవత్సలుడవగు నీవు దొరికిన ఆహారమును నేను విడిచిపెట్టునట్లు చేసితిని (41). ఓ స్వామీ! ఆకలి నన్ను బాధించుచున్నది. నేను మలమల మాడి పోవుచున్నాను. ఓ దేవదేవా! నేను ఏమి తినవలెను? ఓ ప్రభూ! నన్ను ఆజ్ఞాపించుము (42).

సనత్కుమార ఉవాచ |

ఇత్యాకర్ణ్య వచస్తస్య పురుషస్య మహాప్రభుః |
ప్రత్యువాచాద్భుతోతిస్స కౌతుకీ స్వహితం కరః || 43

సనత్కుమారుడిట్లు పలికెను-

గొప్ప లీలలను ప్రకటించువాడు, తన భక్తులకు హితము చేయు ఉత్కంఠ గలవాడు నగు ఆ మహాప్రభుడు ఆ పురుషుని ఈ మాటలను విని ఇట్లు బదులిడెను (43).

మహేశ్వర ఉవాచ |

బుభుక్షా యది తే%తీవ క్షుధా త్వాం బాధతే యది |
సంభక్షయాత్మనశ్శీఘ్రం మాంసం త్వం హస్తపాదయోః || 44

మహేశ్వరుడిట్లు పలికెను-

నీవు మిక్కిలి ఆకలి గొని యున్నచో, ఆకలి నిన్ను బాధించుచున్నచో, నీవు నీ కాళ్లు చేతుల మాంసమును వెంటనే చక్కగా భక్షించుము (44).

సనత్కుమార ఉవాచ |

శివేనైవ మాజ్ఞప్త శ్చఖాద పురుషస్స్వకమ్ | హస్త పాదోద్భవం మాంసం శిరశ్శేషో%భవద్యథా || 45

దృష్ట్వా శిరో విశేషం తు సుప్రసన్నస్సదాశివః | పురుషం భీమకర్మాణం తమువాచ సవిస్మయః || 46

సనత్కుమారుడిట్లు పలికెను-

ఆ పురుషుడు శివునిచే ఇట్లు ఆజ్ఞాపించబడిన వాడై తన కాళ్లుచేతుల లోని మాంసమును భక్షించెను. శిరస్సు మాత్రమే మిగిలి యుండెను (45). శిరస్సు మాత్రమే మిగిలి యుండుటను గాంచి సదాశివుడు మిక్కిలి ప్రసన్నుడై భయంకరమగు కర్మను ఆచరించిన ఆ పురుషునితో విస్మయపూర్వకముగా నిట్లనెను (46).

శివ ఉవాచ |

హే మహాగణ ధన్యస్త్వం మదాజ్ఞా ప్రతిపాలకః | సంతుష్టశ్చాస్మి తే%తీవ కర్మణానేన సత్తమ || 47

త్వం కీర్తి ముఖ సంజ్ఞో హి భవ మద్ద్వారకస్సదా | మహాగణో మహావీరస్సర్వదుష్టభయంకరః || 48

మత్ప్రియస్త్వం మదర్చాయాం సదా పూజ్యో హి మజ్జనైః | త్వదర్చాం యే న కుర్వంతి నైవ తే మత్ప్రియంకరాః || 49

శివుడిట్లు పలికెను-

ఓయీ మహాగణా! నా ఆజ్ఞను పాలించు నీవు ధన్యుడవు. ఓయీ శ్రేష్ఠపురుషా! నీ ఈ కర్మను గాంచి నేను మిక్కిలి సంతసించితిని (47). సర్వదా నా కుమారుడవు, మహాగణుడవు, మహావీరుడవు,

దుష్టులందరికీ భయమును గొల్పువాడవు అగు నీవు కీర్తిముఖుడను పేరును గాంచుము (48). నన్ను పూజించు నా భక్తులు నాకు ప్రియుడవగు నిన్ను కూడ సర్వదా పూజించెదరు. నిన్ను పూజించని వారు నాకు ఎన్నటికి ప్రీతి పాత్రులు కాజాలరు (49).

సనత్కుమార ఉవాచ |

ఇతి శంభోర్వరం ప్రాప్య పురుషః ప్రజహర్ష సః | తదా ప్రభృతి దేవేశద్వారే కీర్తి ముఖస్థ్సితః || 50

పూజనీయో విశేషేణ స గణశ్శివపూజనే | నార్చయంతీహ యే పూర్వం తేషామర్చా వృథా భ##వేత్ || 51

ఇతి శ్రీ శివమహాపురాణములో రుద్ర సంహితయందు యుద్ధఖండే దూతసంవాదో నామ ఏకోనవింశో%ధ్యాయః (19).

సనత్కుమారుడిట్లు పలికెను-

శివుని నుండి ఇట్టి వరమును పొంది ఆ పురుషుడు మిక్కిలి సంతసిల్లెను. అప్పటి నుండియు కీర్తిముఖుడు దేవదేవుని ద్వారము వద్ద నిలబడి యున్నాడు (50). శివుని పూజించువారు ఆ గణుని శ్రద్ధతో పూజించవలెను. ఎవరైతే ముందుగా ఆతనిని పూజించరో, వారి పూజ వ్యర్థమగును

శ్రీ శివమహాపురాణములో రుద్ర సంహితయందు యుద్ధఖండములో దూతసంవాదమనే పందొమ్మిదవ అధ్యాయము ముగిసినది (19).